శ్రీ పార్వత్యై నమః

# భూ కైలాసము



(హరికథ)



రచయిత:

ములుకుట్ల పున్నయ్యశాస్త్రి భాగవతార్.

రెండవ కూర్పు 1000

పబ్లిషరు:

కురుకూరి సుబ్బారావు సన్స్,

ప్రొప్రయిటరు:

సరస్వతీ బుక్ డిపో, బుక్ సెల్లర్సు అండ్ పబ్లిషర్సు

విజయవాడ - 1.

 1953 [వెల రు 0-12-0

## కృతిసమర్పణము.

గీ॥ ముదముమీఱంగ నవమాస । ములు భరించి
నన్నుగని, పెంచి, లాలించి । నట్టితల్లి
యైన "వేంకటసుబ్బమ" కేను "కృతి స
మర్పణం" బొనరించితి । నధికభక్తి.

ఇట్లు,
గ్రంథకర్త.

# పీఠిక.



ఆర్యులారా!

బొంబాయి రాజధానిలో, కార్వారు జిల్లాలో, హుబ్బళికి రమారమి నూఱుమైళ్ల దూరమున మహాబలేశ్వరము, భూకైలాసము, అను నామాంతరములచే బేర్కొనబడుచు ముముక్షుజన తారకంబై, యాసేతు శీతాచలము ప్రసిద్ధి గాంచిన గోకర్ణంబను క్షేత్రరాజం బొక్కటి యలరారుచున్నది గదా? అట్టి దివ్యక్షేత్ర మహాత్మ్యమును భక్తులకు వెల్లడించు తలంపుతో నిదివరకు "మహాభారతము" హరికథా రూపమున రచించి పేరుగాంచిన మన్మిత్రులగు బ్రహ్మశ్రీ ములుకుట్ల పున్నయ్యశాస్త్రి భాగవతార్ గారు, ఈ భూకైలాస హరికథను మోక్షగుండ రామాయణము ననుసరించి మఱికొన్ని కల్పనా విశేషములతో మృదుమధుర శైలితో నొప్పు పద్యములతో, మంజరులతో, గేయములతో, బొందుపరచి సర్వజన సుబోధకమగునటుల రచించి తమకు గల్గిన కవితాశక్తిని సార్థకపఱచుకొనుటయేగాక శ్రోతలగు భక్తులకును, హరిదాసులకును మహోపకార మొనరించిరి. "ప్రమాదోధీమతామపి" యను నార్యోక్త్యనుసారముగ నిందు ముద్రణాది ప్రమాద పతితములగు నెఱసులున్నను, గుణ గ్రహణ ప్రవీణులగు పాఠక మహాశయులా నెఱసుల నఱసి నిఱసింపక గుణముల గ్రహించి మఱల శాస్త్రిగారి కిట్టి గ్రంథ రచనకై ప్రోత్సాహ మొనరింతురుగాక యనియు, ఈలాటి సత్కథలను రచించుటకై భగవంతుడు వీరికి

కవితాశక్తి నింకను పెంపొందించుగాక యనియు పరమేశ్వరుని ప్రార్థించుచున్నాడ.

క॥ మున్ను భారతి రచనన్
నన్నయ, తిక్కన్న, యెఱ్ఱ | నయుబోలె ధరన్
పన్నయశాస్త్రీ! సద్వి
ద్యోన్నతులన్ గాంచి నీవు | వర్ధిలుమింకన్॥

ఇట్లు,

శ్రీ కొండ శంకరశాస్త్రి భాగవతార్,

మారామునుగాల.

---

శ్రీరస్తు.

శ్రీ మత్పరమేశ్వర్యైనమః

# భూ కై లా స ము

(హ రి క థ)

శ్లో॥ వాగీశాద్యాస్సుమనస । స్సర్వార్థానాముపక్రమే
యంనత్వాకృతకృత్యాస్స్యు । స్తన్నమామిగజాననమ్.

మ ం జ రి

శ్రీ కైలాసనివాసుని సత్కృప । చేత మోక్షంబు గనుఁడీ
భూకైలాస విలాసము దెల్పెద । పుణ్యమతులార వినుఁడీ.

సీ॥ పరమేష్ఠి యొసఁగిన । వరగర్వమునఁజేసి
దానవోత్తముఁడు ద । శాననుండు
వనజాప్తుఁడాదిన । వగ్రహంబులుఁదన
పరిచారకులవలె । బనులుసల్ప
సురసిద్ధసాధ్యఖే । చర యక్షగంధర్వ
సంతతుల్ దనకు దా । స్యంబుసేయ
అప్సరస్త్రీల బ । లాత్కారమున దెచ్చి
యానందసౌఖ్యము । లనుభవింప

గీ॥ మునివరేణ్యులు దమ యజ్ఞ । ముల హవిస్సు
లొసఁగకుండిన వారల । గసిమసంగి

క్రూరకర్మములన జంకు | గొంకులేక
రాజ్య పరిపాలనమొనర్చె | రావణుండు.

## మంజరి

అంత లోకనాథుడు నారదుండు బ్ర | హ్మానందంబున శౌరి
సంకీర్తనము పాడుచుఁ బాడుచు | నాడుచు లంకకుఁజేరి.

శ్రీరంజని—ఆది

ఆశ్రితజన | మందార నీకన్న | ఆదరించు
పుణ్యాత్ములెవరన్న ||ఆ||
శాశ్వతానంద | సత్ఫలదాయక | సర్వసుపర్వ
మహామునినాయక ||ఆ||
తెలియగా నెంత | వారలు జీవులు | దేవదేవ !
నీదివ్య తత్త్వంబు ||ఆ||
పిలచినంతనే | పల్కు నీవంటి | ప్రేమమూర్తి
మరి వేరు లేరన్న ||ఆ||

క|| సురతపసి యేగుదెంచెను
వరరావణ దైత్యమాత | భవనంబునకా
గరితముని పాదకమలము
లరుదుగ బూజించిభక్తి | నంజలిజేసెన్.

## మంజరి

తన్ను భక్తిచేఁ బూజసల్పునా | దానవమాతను గాంచి
యన్నారదుండు బల్కె మృదుభాష | ణంబుల హరుని నుతించి.

వ॥ అమ్మా! కైకసీ! నీవు నిరంతర శివపూజా ధురంధర వగుటచేఁ గడుంగడు ధన్యురాలవు కాని

ఉ॥ మర్మలేక దెల్పెదను । మానవతీమణి! నీవు యీ శిలా
నిర్మితమైన లింగమును । నెమ్మిభజించియుఁ బూజసేయనీ
కర్మ మదేమిగల్గెె? దశ । కంఠుఁడు బోయి తపంబొనర్చిన
న్నేర్మి నిజాత్మలింగమును । నీశుఁడొసంగును దానిఁగొల్వుమా

గీ॥ అనినఁ గైకసి నిర్ఘరా । నందమంది
సురమునీ! నీవుజెప్పిన । చొప్పునర్తె
ననఁగఁ దనకోర్కె ఫలియించె । నంచు సంత
సించి జనె మౌని హరుని గీ । ర్తించుకొంచు ॥

మ ం జ రి

మునిబోధనచే నాత్మలింగమును । బూజింప వేఁడుకపడి
దనుజమాత పంక్తిముఖునికడఁ జని । దానిట్లనెను గడువడి

ఉ॥ నారదుఁడేగుదెంచి జన । నంబు తరించెడి దారిసూపె నా
కోరికదీర్చు భారమున । కుంఠిత విక్రమ! నీదెసుమ్మి యీ
ధారుణి తల్లిదండ్రుల ము । దంబును దీర్చెడివాఁడు బుత్రుఁడౌ
గా? రణవిక్రమోన్నత మ । హాబల! దానవ లోకనాయకా!

వ॥ అది యెద్దియన,

శివరంజని—ఆది

ఆలకింపుమా । అసురలోకనాథ
ఆశజెందితి । ఆత్మలింగముకై భజింప ॥ఆ॥

మేలుగల్గు నా । వాంఛదీర్పుమయ్యా
చాల సంతసింతు । జన్మముంగా తరింతు ॥ఆ॥
వీరమాతనంచు । పేరుగన్న దాన
కోరకున్న నా । దివ్యమైన కోర్కె ॥ఆ॥
ధీరవర్య యీ మాతృశాసనంబు
దీక్ష సద్యశంబు । నార్జించుమన్న ॥ఆ॥

## మ ం జ రి

అనిసంగడు భక్తితోడ రావణుం । డామెకోరిక దలంచి
జనని వాంఛితము దీర్పని పుత్రుని । జన్మ వ్యర్థమనియెంచి

వ॥ కైకసితో యిట్లనె

ఉ॥ ఇమ్ముగ ఘోరకానలకు । నేగి యుమాపతింగూర్చి దార్ఢ్యజి
త్తమ్మున భక్తియోగమును । దాల్చి తపంబొనరించి నీదు కా
మ్యమ్మునగూడునట్లు శివు । మానసలింగము దెచ్చువాడనే
నమ్మరో! మ్రొక్కెదగైకొని జ । యంబగు దీవనలిచ్చి పంపుమా.

వ॥ అని జనని యాశీర్వాదంబునొంది దశాననుండు పురంబువదలి జనపదంబులన్నియు గడచి జంబీరనింబ పనసాశ్వత్థ బిల్వ బదరీకపిత్థ మందార పారిజాత సంతాన సముదయంబై, నిర్మల కాసార జలజల జనాళ కబళనోద్ధతమరాళ సంకులంబై, శారికాకీర కలకంఠ కోకిలారావసమ్మిళితంబై, యొప్పు రజితగిరి సమీపారణ్యము జేరి యందు గంగాతీరంబున నొక్కచో దివ్య లింగమును గాంచి యద్దాని సేవింపుచు,

## మం జ రు లు

నిరాహారుఁడై కొన్నిదినంబులు । నిష్ఠండపమొనరించె
హరా! సాంబ! శంకరా! శివమనోహరా! యని మది నుతించె
నిశ్చలభక్తిని దానవనాథుని । నిర్మలతపముఁ జూచి
యాశ్చర్యంబునుగని నారదుండు । సరిగె వార్వతిఁగూర్చి

వ॥ కైలాసంబుఁజేరి నారదుండందలి విశేషముల మెచ్చుచు,

సీ॥ మహిత పంచాక్షరి । మంత్రరాజంబును
మించిన భక్తిఁ జ । పించువారి
మీఁజి శ్రీశైవక । థారహస్యంబులఁ
శిష్యరత్నములకుఁ । జెప్పువారి
మాటి మాటికి "ఓంనమశ్శివాయ" యటంచు
పరమేశు నామము । పాడుఁవారి
లలితమౌ బిల్వద । ళంబుల సనిశము
శంకరు పదపూజ । సల్పువారి

గీ॥ చెలఁగి తాండవనృత్యము । సేయువారి
చంద్రశేఖరుగాథలఁ । జదువువారిఁ
గాంచి కడుఁ నిర్భరానంద । కలితుఁడగుచుఁ
గదలె నారదుఁడటనుండి । గౌరికడకు.

వ॥ ఇట్లు చనుదెంచి రత్నసింహాసనాసీనయగు

గీ॥ వితత కరుణాప్రదాత శ్రీ । విశ్వమాత
భక్తలోక మానితసుర । పారుజాత

యగుజగన్నేత, నగజాత । నమితపూతఁ
గాంచె సురముని కన్నుల । కఱవుఁదీర॥

వ॥ భవానింగాంచి చేతులు జోడించి

కేదారగౌళ—చతురశ్ర

జయజయ శంకరీ! జగత్పావనీ! జయజయ చంచత్కురంగేక్షణీ!
జయజయ పరదైతేయ భయంకరి । జయజయ బ్రహ్మాండ
భాండోదరీ! ॥జ॥

మిశ్ర

జయజయ సర్వ వరప్రదాయినీ!
జయజయ సురరాజార్చిత చరణీ!
జయజయ దుర్గా! జగత్పావనీ!
దయజూడుము పుష్పయశాస్త్రిపాలిని! ॥జ॥

చ॥ అని యిటుసన్నుతించు ముని । కంబిక నిట్లనునోయి వత్స నీ
వెనయఁగవచ్చినావిటకు । వెచ్చటనుండి, జగంబునందు స
జ్జనుల చరిత్రలేమయిన । సంతసమొప్పఁగ దెల్పుమన్న, దా
మనమున సంతసింపుచును । మా సతికిట్లనె మానినాథుడుర్వ

సీ॥ బహుపుణ్య శోభితం । బై యలరారెడు
భూలోకమునకేను । బోతినమ్మ!
నిరుపమమణి రత్న । నిర్మితంబై వన్నె
గాంచు లంకాపురి । గంటినమ్మ!

సురులను పాదదా । సులజేసి కొల్వు జే
యించు రావణుని పీ । క్షించితమ్మ !
కైకసి యాత్మలిం । గము శివుణ మెప్పించి
తెమ్మని సుతుని బో । ధించెనమ్మ !
దానవుడు ఘోరతపమును । బూనెనమ్మ !
ఇందుధరు నాత్మలింగము । బొందునమ్మ !
ఆత్మ తేజము బోయిన । అయనేల
నమ్మ ! నీసౌఖ్య మడవి । పాలయ్యెనమ్మ !

## మ ం జ రి

తననాథుడు నిస్తేజుండగు వార్తను వినియును నగజాత
మనమున దల్లడమందియు నారద । మౌని కిట్లనె ప్రఫూత॥

### అభేరి—ఆది

మౌనినాథ ! ఇదియేమి విచిత్రము । దానవాధమున ।
కేమి యాగడము ॥మౌ॥
దీని కేమైన । కలదా మార్గము । దెల్పుమయ్యా తీ ।
రును నా దుఃఖము ॥మౌ॥
ఆత్మలింగమును । హరియించినచో
ఆత్మేశుడు జీ । వచ్ఛవమేగద
ఆత్మశాంతిగా । రావణుని తపము
అంతమగు దారి । యోచింపుమయ్యా ॥మౌ॥

వ॥ మునీంద్రా ! నీవు త్రికాలవేదివికదా ! రావణుని తపోభంగమగు మార్గంబు గలదేని దెల్పుము.

## మ ం జ రి

అని నారదుఁడు కొంతతడవు తన । యాత్మలోనఁ జింతించి
జననీ! నీకు సహాయము దెల్పెద । నల్పమట్లు యోజించి॥

వ॥ అమ్మా! రావణుండు తామసగుణ ప్రధానుండు గాన భక్తవత్సలుండగు నీ నాథుండు వానికి బ్రత్యక్షమగుతరి నీవు నీ మగనివెంటనేగి వాఁడు కన్నులు దెరువగనె ముందుగా నీ జగన్మోహనాకారము వానికి గనుపింపజేయుము. వాఁడును నీమూర్తింగాంచి భ్రమించి యాత్మలింగాపేక్ష మానుననిన భవాని విభ్రాంతయై

### బాగేశ్వరి—రూప

మునివరా! తమబోంట్లిటు బో । ధనసేయఁగ ధర్మమౌనె ?
ఘన సుశీలనగు నన్నీ । కానిపని యొనర్పమనెదె ॥మా॥
మతిమంతుఁడవగుదువు నా । మనసు నీ కెఱుంగరాదె
పతివ్రతాత్వ భంగమునకు । బొల్పడుదునె వేయేలా? ॥మా॥

వ॥ అనిన ముని యిట్లనియె

ఉ॥ ఇమ్ముగ మూఁడుమూర్తులకు । నేలిక వౌదువుగాదె నీవు మా
యమ్మరో! నీవెరుంగని కృ । తాకృతకార్యములుండునోక్కో! లో
కమ్ముల బ్రోచుమాతకిది । కష్టమె నీవిటు లాచరించినన్
ఇమ్మహిమానవావళి ద । రింతురు, కాంతురు మోక్షసంపదల్.

## మ ం జ రు లు

అనిన లోకమాత యిట్లనియె ముని । నాథ శీలభంగమ్ము
నొనరించెడి యీ పాపకార్యమ్ము । నొనరింపను సత్యమ్ము

పాపిరావణుని వెంటబోయి నా । పాతివ్రత్యమ్ముమాని
నాసాటివారిలో నవమానం । బందుదునేమేఁగాని

వ॥ అనిన నప్పుడు ముని యిట్లనియె

ఉ॥ నీమది సందియంబు గన । నేటికి హైమవతీ! నిశాటుక
న్యాయమి త్వదీయకష్ట మెడ । బాటొనరించెద నందు చేత సు
త్రామవిరోధికిన్ గడు వ్య । థాయగునమ్మ! తపంబు నీమనః
కాముని యాత్మలింగమును । గైకొనలేడు నిజమ్ము నమ్ముమా.

## మ ం జ రి

ఇందు నాఁ జెప్పినది లోపంబగు । నేని నీవిప్పుడేఁగి
యిందు కళాధరు నడిగిచూడుమా । సందియంబు మదివీఁగి.

వ॥ అని నారదుడు తనదారినేగె. పార్వతి ఈశ్వరుని కడ కేగి—

అఠాణా—త్రిపుట

ప్రాణనాయక! నారదుండొక । పాడువార్తను దెల్పిపోయె
దాని సత్యాసత్యములు నీ । దాపున దెలియంగవచ్చితి ॥ప్రా॥
హెచ్చుగా నినుఁగొల్చువారల । మెచ్చి నీ దేహంబునైన
నిచ్చు ఘన దేవుండవని రా । త్రించరుఁడు తపమాచరించెను ॥ప్రా॥

మి॥ సచ్చరిత్ర! నీ యాత్మలింగ
సంగ్రహమునకై దానిని నీ
విచ్చినఁ గైలాసము పాడగు
విధు విహీనమగు నిశిపోలెన్ గాదె? ॥ప్రా॥

సీ॥ లోకసౌఖ్యమ్ము నా । లోచించి రక్షింప
నిశితేఁడు నెత్తిపై । నెక్కినాఁడు
భక్తుఁడంచని బాణు । వరము వేఁడుమటన్న
కొంప కావలిగాయఁ । గోరినాఁడు
భస్మాసురునిగోర్కె । పాలింప మూఢుఁడై
నిన్నె భస్మముసేయ । నెన్నినాఁడు
దేవతావళిబాధ । దీర్ప రమ్మనిబిల్చి
గిరిధారి విషము గ్రిం । గించినాఁడు

గీ॥ వారలే బుద్ధిమంతులు । ప్రాణమునకు
హానిసేయరు? నేఁడో ఈ దానవుండు
ఆత్మ తేజము గొనునఁట । నక్కటకట!
యింత పిచ్చిదేవుఁడవైతి । వేమినాథ!

వ॥ అని విచారమందుచున్న గౌరింగాంచి శర్వుం డిట్లనె

హిం॥ కాఫీ—చతురస్ర

మనమున భయమేలా? బాలా!
విను నా లీలలు గనుఁగొనఁగలరే? ॥మ॥
భక్తరక్షణార్థము నేనెంతటి
బాధలైన ననుభవము నొందెదన్ ॥మ॥
కంటికి ఱెప్పవిధమునన్ భక్తులఁ
గాచుచుంటయే నా విద్ధిగాదే? ॥మ॥

వ॥. అనిన గౌరి తనకు నారదుం డెరింగించిన మార్గము దెల్పి యట్లొనర్తునా యనిన శంకరుండొకింత యోజించియిట్లనె

మ॥ పాలతీ ! నారదుఁడాడినట్టి వచనం । బుల్ లోక
సమ్మోహనముల్
గలదంచున్ బాడకట్టుచుండె నటుతే । గానిమ్ము! దైత్యేశ్వరుం
డ్రాలుపేర్పన్ దరియమ్మె నాతని తపః । స్నిన్ లోకముల్గాల్పఁజ
వులు "మొఱ్ఱో" యని యేడ్చుచుండె రడినో ? బూఁబోఁడి !
కన్గొంటివే॥

వ॥ కాన మనమాతనికడ కేగుదమని దలంచుచుండ తపస్సమాధి నిష్ఠాగరిష్ఠుండైన రావణుండు మహాదేవుం దలంచి

సీ॥ పాంకంబుగా మేన । భూతిఁ బూసినవాఁడ !
భూత ప్రేత పిశాచ । ములకు జేఁడ !
బాలచందురు నెత్తి । పైఁ ధరించినవాఁడ !
ఆబోతుపైఁ దిరు । గాఁడువాఁడ !
జింకఁదాల్చినవాఁడ । శ్రీపతి చెలికాఁడ !
కరుణచే భక్తుల । గాఁచువాఁడ !
రజితాద్రిపై విహా । రము సేయు మొనగాఁడ !
దాసుల మదిలోనఁ । దాఁగువాఁడ !

గీ॥ కన్నడేలర పార్వతీ । వన్నెకాఁడ ?
దుర్బలులపాలి కీవెగా । దోఁడునీఁడ !
నగకులేశ్వరు సుతతోడ । నన్నుఁజూఁడ !
వేగ కరుణింపరాఁగదే । వేల్పుజేఁడ !

వ॥ అని స్తుతింపుచు-

## మంజరి

పంచాగ్ని మధ్యమునను౦డి దపం । బాచరించు రావణుని
కాంచనాంగితో జనుదెంచి హరుఁడు । గాంచె న త్తపోధనుని॥
వ॥ ఇట్లు చనుదెంచి కరుణారసమొల్క రావణున కిట్లనె

శ్రీరాగం—రూప

ఆనందించితి తపమున । కన్నా ! దైతేయమిన్న !
గాన నిన్ను వంటి దపము । గావించినవారు సున్న ॥ఆ॥
కోరుకొమ్ము ఇచ్చెద నీ । కోర్కెల్ల దానవేంద్ర !
మారుమాటలాడక నీ । మది సంతస మందజేతు ॥నా॥

## మంజరులు

అనిపల్కు దేవదేవు వాక్యముల । కసురుఁడు సంతోషించె
కనులువిప్పగా నెట్టయెదుట నా । కాత్యాయని గన్పించె
ఆ త్రిలోక మోహాన రూపంబున । కలరి దేహముప్పొంగ
రాత్రించరనాధుఁడు తనమది నా । రాటముం గడుజెలంగ॥

వ॥ తనమది నిట్లుదలంచె

యమున—ఆది

కలికి పోయగమెన్నద రమా । యీ
చెలియ చక్కదనాల । సీమ, ముద్దుల భామ ॥క॥
వాలుకన్నుల సౌరు । వారిజముల గేరు
బాలికామణి మోముతీరు । ఔరౌరా! యమృతంబుగారు, ఈ
బాలకౌగిటఁ దేల ? పాడు స్వర్గంబేల ? ॥క॥

సీ॥ లలితసౌందర్య యీ । లావణ్యసీమను
గాంచజాలని నాదు । కన్నులేల?
నద్దమ్ముమించు ని । మ్ముద్దియ చెక్కులు
ముద్దాడలేని కె । మ్మోవియేల?
మదికింపుగుల్కు నీ । మగువతో ముచ్చట
నాడఁజాలని నాదు । నాలుకేల?
కమనీయ గాత్రిని । కౌఁగిటిలోఁజేర్చి
లాలింపనట్టి క । రంబులేల?
గీ॥ భాగ్యభోగంబులేల? ద । పంబులేల?
రాజ్యమదియేల? మదన సా । మ్రాజ్యలక్ష్మి
చెలుల మేల్ బంతి దీనితో । గలసిమెలసి
సౌఖ్యములఁ గాంచలేని నా । జన్మమేల॥

## మ ం జ రి

కన్నులు దిగ్భ్రమమందు సోయగము । గాంచి దానవుండంత
పన్నగభూషణు పాదములఁబడి । బ్రస్తుతించెఁ దానెంత॥

### హిం॥ తోడి—చతురశ్ర

ఈశా! భక్తజన హృదీశా! మహేశా! ప
రేశా! పాహిమాం ప్రభో!
నాశరహితకైలాసనివేశ । వాసవాది సురవరమనోల్లాస! ॥ఈ

మి॥ దాసజనుల బ్రోతువనెడి గంకణ
ధారివంచు నీ పదకంజంబుల

నాసతోడ సేవించితి విశ్వ ని
వాస ! సర్వభూ తేశ ! భవనాశ ! ॥ఈ॥

వ॥ అని నుతింప హరుండిట్లనె-

ఉ॥ ఎన్నగ నీదుభ క్తి మది । కెంత ప్రమోదము జెందఁజేసెనో
యన్న ! ధనంబొ ? రత్న నివ । హంబొ ? సమ స్తప్రశ స్త
శస్త్రసం
పన్నతయో? సురేంద్రసమ । భాగ్యవిలాసము? యెద్దియేని వి
ద్వన్నుత! నీకుఁగావలయు । దానినవశ్యము వేడుమిచ్చెదన్॥

వ॥ అనిన రావణుండు మహాదేవున కిట్లనె-

సీ॥ లలితవిలాస దీ । ప్తులచేఁ బ్రకాశించు
తను రామణీయక । మొనరుదాని
నిండుకల్వలజేని । నిరసించునన జగ
న్మోహనంబగు ముద్దు । మోముదాని
ఇక్షుశరు కటాక్ష వీక్షణంబులవలె
శోభిల్లు నిడువాలు । జూడ్కిదాని
మారుతాపాగ్నిఁ జ । ల్లారఁజేసెడి సుధా
రస మొల్కు మధురా । ధరంబుదాని

గీ॥ భార్యయని నీవు నానంద । పడెడిదాని
మించుకీర్తిని నాకు గ । న్పించుదాని
గోరితిని మాటదక్కించు । కొనెదవేని
పరముగానిమ్ము వేఱేమి వలదు వలదు॥

వ॥ అని కోరిన హరుండు మండిపడి యిట్లనె-

మోహన—చతురశ్ర

కులనాశనమందుట కై నీకీ । కోర్కెగలైనో తులువా!
జలజాత్మజ సంసేవితపదకం । జాత గౌరి నీకు మాతగాదా? ॥కు॥

మి॥ యిలన్ సమస్త చరాచరంబులకు
నేలికయగు మాయాస్వరూపిణిన్
వలచినట్టి నీ నాలుకన్ జీల్చి
వైచిన పాపములేదు రాక్షసా! ॥కు॥

వ॥ అనిపల్కిన శివునిగాంచి రావణుం డిట్లనె-

ఉ॥ కోరినకోర్కెలెల్ల నొసగ । గూర్తును వేడుమటంచు డంబముల్
మీరఁగబల్కు నాకు భ్రమ । మీరిన గోరిక గోరితిందు నా
నేరమదేమి? యీవరము । నీకు బ్రమాదమయేమి మానుకో
మ్మారడి నీకుగల్గును బ్ర । మాణము తప్పితివంచు శంకరా!

వ॥ అనిన శంకరుండు మరల శాంతవచనంబుల నిట్లనె-

మంజరి

తగదు తగదు యీకోరిక గోరన్ । దానవకుల సంపన్నా!
నగజాతపైనిగోర్కి నీవంశ । నాశన కారణమన్నా!

వ॥ అనిన మరల రావణుం డిట్లనె-

గీ॥ సత్యవాక్పాలనుఁడ వేని । సఖియనిమ్ము
లేదనెదవేని యనృత । వాదిగమ్ము
గాన నీ రెంట నొక్క మా । ర్గమున బొమ్ము
అదియుగాదేని దారి బ । ల్పైదను సుమ్ము॥

వ॥ అనిన హారుం డిట్లనె-

## మం జ రి

భూమి సర్వజీవులకు తల్లియగు । పూఁబోడిని గామించి
"కామి" వగుదె దనుజేశ! మరొక్కటి గాంక్షింపు మద్గ్రహించి

వ॥ అన నవ్వి రావణుండు హరునితో నిట్లనె మహాత్మా! నేను "కామి"నని బల్కుచున్నారు యిదిగో! యిటువినుఁడు-

సీ॥ కన్నకూతుర భార్యగాఁ జేసికొన్నట్టి
మాధవుసుతుఁడు గా । మలుఁడుగాదె?
తనివిదీఱఁగ యహ । ల్యను గూఁడినట్టి, యా
మఖవుఁడెన్నంగ కా । మలుఁడుగాదె?
సురగురు పతితోడ । మరుకేళిఁగూడిన
మదనునిమామ కా । మలుఁడుగాదె?
బ్రహ్మత్వమందియు । భార్యాద్వయముతోడ
మరఁగు కశ్యపుఁడు గా । మలుఁడుగాదె?

గీ॥ అంతదూరము పోనేల । యభవనీవు
గౌరియుండఁగ నెత్తిన । గంగదాల్చి
కులుకుచుండెదవే కాము । కుఁడవుగాదె?
"కామి" గాకున్న మోక్షము । గలదె? శివుఁడా!

వ॥ అని పాపాత్ముండిట్లు తన మూర్ఖము మానకున్న హరుండన్నమాట దిరుగాఁడలేకరహస్యంబుగా పార్వతి కిట్లనియె-

ఉ॥ పావని శాంకరీ! వినుము । బల్కెద నేనొకమాట వీఁడు దు
ష్టావమతిక యధర్మమగు । దారిఁ జరించుచునుండె, సర్వలో

కావళికెల్ల మూలమగు । గ_ర్తవు నీవెగదా ! మనోహరీ !
నా వచనంబునిల్పి, దితి । నందను బారిని జిక్కకుండుమా॥

వ॥ అనిదెల్పి రావణుంగాంచి యోరీ! నీయూహితంబు దీరునట్లీమె నిచ్చటనె డించి పోవుచుంటినని యంతర్హితుండయ్యె. పార్వతియు నాధు నాజ్ఞఁగైకొని రావణునివెంట లంకానగర మార్గంబునుంబట్టె. నిదియంతయు గాంచుచున్న నారదుండు వైకుంఠంబున కేఁగి శ్రీహరిం గాంచి-

ఉ॥ మాయలమారిరావణుఁడు । మాపతిఁగూర్చిదపంబొనర్ప గా
త్యాయని వల్లభుండతని । దాపునకేఁగ్రి యభీష్ట మేమనన్
జాయనుగోర, నిచ్చె, ముర । శాసన! పాపము లోకమాతకున్
సాయము సేయకున్న గడు । జాలినిబొందు రమామనోహరా!

వ॥ అనిన హరి యిట్లనె,

బిలహరి—చతురస్ర

మూఁడుమూర్తులకు మూలమగు నాది । మూ_ర్తి యా తల్లి
గాదా ? నారద
వీఁడుమింక సందియంబు మునివర ! విశ్వమాత కొక్కని తో
డ దేల ? ॥మూ॥

మి శ్ర

కీఁడుజేయనెంచినయా దానవు
నేఁడు భంగపెట్టి హరుని జేరున్
చూఁడుమింక, నీ నేర్పునవానికి
సుదతిపై రోతఁబుట్టింపుమా ॥మూ॥

వ॥ అనిన నారదుండు దామోదరా! నేనట్టులే యొన ర్చెదనుగాని నీవుమాత్రము సమయము వచ్చినప్పుడు రావణుని కంటికా లోకమాత "శ క్తి" వలె గాన్పించునట్లనుగ్రహింపు మన హరి "వల్లె" యనె. నారదుం డటనుండి కదలి రావణునకు మార్గమధ్యంబున నెదురుబోవుచు-

హిం॥ కన్నడ—ఆది

రామభ క్తిఁ గనరాదె మనసా! పామరత్వమదియేలా? ॥రా॥
కామభోగముల నాశలుగల్గి । కాలునిబాధలఁ గననేలా? ॥రా॥
భాగ్యభోగ్యములపై భ్రమజెంది । పాపకృత్యములు
సల్పెదవా? ॥రా॥
ఆలుసుతులపై నాశజనించి । యాశాపాశమునఁజిక్కెదవా? ॥రా॥

## మ ం జ రి

ఈగతిగానము బాడుచు నారదుఁ । డెదురువచ్చుటఁ గాంచి
వేఁగ మునిపాదములకు దై తేయ । వీరుఁడు నమస్కరించి.

వ॥ తనకు పార్వతీలాభంబుగల్గిన దెలిం గెటింగించి యుబ్బుచున్న నారదుండిట్లనె-

కల్యాణి—రూప

పరమేశుని లీలఁదెలియ । పాతకులకుఁ దరమౌనా?
గౌరినిచ్చె నాకని చం । కలు గొట్టెదవే? రావణ! ॥ప॥
మి॥ చరాచరాత్మకమగు భూ
జాలములకుఁ దల్లియైన

గిరితనయను నీ కేఁడ ?
పురహరుం డొసంగు టేఁడ ? ॥ప॥

ఉ॥ ఏలర పిచ్చిరావణ ! మ । హేశుఁడు మోసముజేసెనిన్ను, గౌ
రీ లలితాంగి నీకునిడ । నిష్టముసెందక దాఁచెనేఁడు పా
తాళముసందు, నీ పరము । దప్పువిచారించెఁ దీనినిచ్చె, నీ
కేలర యీపిశాచము ద । రిద్రుఁడు శంభున కే యొసంగుమా.

వ॥ అని చెల్ప రావణుండు వెనుకకుమరలి చూఁడ పార్వతి రూపంబునకుమారు ఘోర పిశాచరూపంబునుంగాంచి భయమంది నారదా ! దురాత్ముండైన హరుండు నన్నెంత మోసంబొనరించెనో జూచితివా-

శా॥ ఔరా ! శంభుఁడు ద్రోహచిత్తుఁడయి న । న్నన్యాయముఁ జేసె, నీ
కారుణ్యంబున దెల్పినంతఁ దెలియం । గానయ్యె, లేకున్న యీ
ఘోరాకారపిశాచమే గతిగదా ! క్రూరుండు నా కండ్లలోఁ
గారంబుఁ జెదజల్లె నాతనికె నీ । కాళ్ళఁ సమర్పించెదన్॥

వ॥ మునీంద్రా ! శంకరుండు పార్వతిని పాతాళంబున నెందుదాచెనో దెల్పి పున్నెముగట్టుకొనుమని ప్రార్థింప ముని రావణా ! పాతాళ రాక్షసచక్రవర్తియగు మయునియింట గౌరినిం దాచె. నీ శక్తిని శంకరునకిచ్చి నావెంట రమ్ము నేజూ పెదనన దనుజుండు నారదా ! నీవుకూడ నావెంట కైలాసంబు నకుంగూఁడ నరుదెమ్మన, మునియు సమ్మతింప నా యిర్వురు జగదంబనుగొని శివునికడ కరిగిన రావణుండు కోపంబున హరున కిట్లనె-

సింహేంద్రమధ్యము—జంపె

ఎంత మోసముజేసి । తివి నన్ను శంకరా !
యింత కుటిలుఁడవంచు । నే నెరుంగకపోతి ॥నెం॥
కాంతనిచ్చితివంచు । సంతోషమందితిని
కాళికాశ క్తి నిడి । కంట దుమ్మేసితివి ॥ఎం॥
పాతాళమున మయుని । పంచ దాచితివంట
పాప మీ మాని దె । ల్పకయున్న నేమౌను ॥ఎం॥

వ॥ ఇట్లు రావణుండన-

## మ ం జ రి

వినియుఁ బురహరుఁడు నవ్వి రావణా । యిందు మోసంబులేదు
వనితామణి పార్వతియే యియ్యది । మునిమాటలఁ జెడిపోదు॥

వ॥ అనిన నారదుండాత్మలో నవ్వుకొనుచు రావణుని పక్షంబుబల్కు వానివోలె శంకరున కిట్లనె-

ఉ॥ సారెకు భ క్తసంతతుల । సాకెడి దేవుఁడనంచు గొప్పగా
పేరుధరించి రాక్షస మ । హీశుని మోసముజేసినాఁడవో
మారవిరోధి! చాలు తమమాటలు, (రావణునితో) రావణ!
రమ్ము పీని వా
క్సారము తెల్లమయ్యె నగ । జాతను జూఁడఁగబోద మి త్తరిన్॥

## మ ం జ రి

నారదు వాక్యములే సత్యములని । గౌరిని శివుకడదించి
వారిద్దరు పాతాళంబును బో । వఁగ ప్రయాణ మొనరించి॥

వ॥ పోవుచుండిరి. పాతాళంబున మయుని కొమార్తెయగు మండోదరి మున్నొకసారి నారదునిచే రావణుని రూపసౌందర్య బలపరాక్రమంబులు విని యాతండే మగఁడగునని మనంబున వరించి తన మనోహరులభ్యంబునకై జగదంబను నిత్యంబు నత్యంత భక్తిచేఁ బూజించుచుండె. నాఁడును మండోదరి పూజాద్రవ్యంబులంగొని తన యుద్యానవనంబుననున్న తన యిలవేల్పగు గౌరీ దేవళంబున కరిగి యామెను బూజించి, చేతులు జోడించి-

హిం॥ తోడి—చతురస్ర

తల్లీ! సద్గుణ కల్ప । వల్లీ! కరుణ వెదఁ । జల్లి నను గావవే
పల్లవపాణి నీ । పదములెనమ్మితి । పంక్తికంధరుని నా ప్రాణేశు
జేయుము ॥త॥

మి॥ ఫుల్లాంభోరుహ పత్రనేత్రి! సుర
పూజితే, వేదమయి గాయత్రీ
చల్లనిగృపతో నా ప్రియుని నొక్క-
సారి కన్నులకు జూపింపఁగదే ॥త॥

వ॥ ఇట్లు ప్రార్థించి యటనుండి యొక చలువరాతి తిన్నెపైఁ గూరుచుండి తన మనోనాథునిం దలంచి-

ఉ॥ ఏగతినీవు నాకు గను । పింతువు నింతువు సౌఖ్యవార్ధి, నే
లాగున నిన్ను నే బరిణ । యంబునుగాంతును? నారదుండు నా
కాగతిజెప్పి పోయె మను । మంతయు నల్పకపోయె, నాస్థితిఁ
యే గుణశాలి నీకు నెఱిఁ । గింపఁగ బంపుదు జీవితేశ్వరా!

వ॥ మండోదరి యిట్లు విచారించుతరి నారద రావణులా యుద్యానవనంబునంజేరిన నామె వారలం బూజించి యుచితాస

సంబులనిడి నారదుఁ వెంటవచ్చిన యాతండు తన మనోహరుం
డైన రావణుండేమోయని సందియ మందుచుండ నారదుండు
రావణున కిట్లనె-

శ్రీరాగం—ఖండ

చూచితే రావణా! సుదతి కాత్యాయనిఁ
దాచెనని దెల్పితి వృథాయగునె నా మాట ॥చూ॥
ఆ లలిత సౌందర్య । మా తనూలతకాంతి
యేలోకమందైన । వీక్షించినాడవే॥ ॥చూ॥

వ॥ రావణుండు మండోదరి యసమానవిలాసంబుగాంచి-

ఉ॥ ఇట్టి తనూవిలాసము వ । హించుటచేతనే దీనిఁదాచెఁ దా
గట్టులఱేని యల్లుఁడు, బి । కారికి నీ రమణీశిరోమణిఁ
గట్టిన యా విరించి మతి । గాలెనె? నీ దయచేతగాదె జే
పట్టెడి భాగ్యముఁ గలిగె । బద్మదళాక్షి నినేఁడు నారదా!

వ॥ అని కామాంధుండై మండోదరిని సమీపించి-

మోహన—చతురస్ర

బాలా! నిన్నిట హరుఁడు దాచినఁ । బాసిపోదునే గౌరీ!
ఫాలలోచనుఁడు నాకీడక నిన్ను । భామరో! నిందులదాచె
గాబోలు ॥బా॥

మి॥ ఏల నా దరిద్రుని గట్టుకొన్న
నేమి సౌఖ్యంబు లందెదవు నీవు
గోల! నన్ను జేపట్టి నాలంక
కుం దొరసానివి గమ్ము వేయేల ॥బా॥

వ॥ అని ఒల్కుచు విూదికి వచ్చుచున్న సంభ్రమాశ్చర్యంబులు ముప్పిరిగొన మండోదరి నారదు జేరి మునీంద్రా! యీ మహాత్ముండెవ్వఁడు నన్ను పార్వతివలె భావించి యేమో బల్కుచున్నాఁడన ముని యిట్లనె.

ఉ॥ ఎవ్వని జూపసంపదల । నింతిరొ ముక్క వచించినాఁడనో?
నెవ్వఁడు సర్వ దిక్పతుల । నెల్ల జయించి యశంబుఁగాంచెనో?
నెవ్వని నీ ప్రియుంపు వ్యాప । దేశ్వరుగా మది నెంచుచుంటివో?
గ్రవ్వి రుబోఁడి! యీ దనుజ । కుంజరు రావణుఁడీతఁ డేసుమీ॥

వ॥ అని చెల్వ మండోదరి తన ప్రియుని దర్శనమయ్యెనని సంతసంబును, తన్ను పార్వతిగా భ్రమించి పల్కు మాటలకు భయంబును, పెనగొని విచారమందుచుండ రావణుండు మరల నామె దాపున కేఁగి-

ముఖారి—రూప

తాళజాలనే బాలా! దయఁజూడఁగ రాదేల?
కూళ మన్మథుఁడు నన్ విరి । కోలలచేఁ దూలనేసె ॥తా॥
భిక్షుఁడైన నీ మగనికి । భీతినందెదేమొ నీవు
రాక్షసేశు దాపునున్న । రారటు బ్రహ్మాదులైన ॥తా॥

వ॥ అని రావణుండు బల్కుచుండ, రావణు మనఃప్రీతికై నారదుండును మాటిమాటికి తన్ను పార్వతీ! యని సంభోధించుచుండ, మండోదరి దిగ్భ్రాంతయై మునిపాదంబుల బడి-

మ ం జ రి

తాపసేంద్ర! యీ విపరీతమేమి! దానవపతివలె నీవు
యీ పగిదిఁ పార్వతియని బిల్చెద । వే నన్నెఱుఁగవె నీవు॥

వ॥ అని వేఁడిన నారదుండు రావణుని దూరముగా బొమ్మని యూమెతో నిట్లనె. మండోదరీ! యీతండు లోక మాతయగు పార్వతిని మోహింప గౌరి పాతాళముననున్నదని నేదెల్పి నిందు తెచ్చితిని భయమందకుమనె. రావణుండును నారదా! యేల యాలస్యంబు చేసెను గొనిపోదునని మండోదరి దాపునకేఁగ నామె శాంతవచనంబుల నిట్లనె-

కల్యాణి—ఆట

తల్లిదండ్రుల దాపుదానను । దానవేశ్వర! నమ్ముమూ
యుల్లమున నిన్నే వరించితి । తల్లి శాంకరి సాక్షిగా ॥త॥
జనకుసమ్మతిఁ గోరి మీరలు । నను బరిగ్రహమందుఁడు
అనదనగు నాపైని మీ కరు । ణా కటాక్షమునుంపుఁడు ॥త॥

వ॥ అనిన రావణునిగాంచి నారదుండు "దానవేశ్వరా! మయాసురు నడిగియే పెండ్లి జేసికొందువు నింతలో మించిన దేమి రమ్మ"ని యాతనింగొని మయుని యాస్థానంబున కేఁగిన నాతండు నారద రావణుల సత్కరించి వచ్చినపని దెల్పుఁడన రావణుం డిట్లనె. రాక్షసనాయకా! నేను శివునింగూర్చి తప మొనరింప బ్రసన్నుండై-

గీ॥ వనితనిచ్చితినని ముందు । వర మొసంగి
ఘనపిశాచిని నాకంట । గట్టి సతిని
దాచె నీయింట, నీ దొంగ । తనము నాకు
ఘనుఁడు యీ నారదుం డెరుఁ । గంగఁజేసె॥

మ ం జ రి

సామవాక్యముల దెల్పుచుంటినా । శర్వాణిని నాకిమ్మా
భామామణి నీకుంటి వేని నీ । ప్రాణము లెగురును సుమ్మా.

వ॥ అనిన మయుండు రావణా! నాయింట నేమి? గౌరిని హరుండు దాచు టేమి? విపరీతంబుగానున్నది. నాయింటనుండు నది నాకొమరితయైన మండోదరిగాని పార్వతిగాదన రావణుండు వినక నోటికివచ్చినట్లు ప్రేలుచుండ మయుండిట్లనె-

పూరి కల్యాణి—రూప

కారులు ప్రేలెదవేరా! గర్వాంధుడవై శూరా!
గౌరిని నాయింటఁదాచి । కల్లమాట దెల్పితినా ॥కా॥
భూలోకపు దొరనని కడు । పొంగిపడెద వేమేమో
మీలోకముగాగిది పా । తాళము మయునెఱుగవేమొ ॥కా॥

వ॥ అనిన రావణుం డిట్లనె-

మ ం జ రి

పాతాళేశుఁడ మయుఁడనేనంచు । బల్కిన వెఱఁగుపడుదునే నీ
తాతయైన భయమందను నే గా । త్యాయని విడిపోవుదునే.

వ॥ అనుచు వారలు వీరాలాపంబులాడుకొనుచు గదలు ఝళిపించుకొనుచు, ముష్టిఘాతంబుల బొడుచుచు, ద్వంద యుద్ధం బొనర్చుచు, నంతకంతకు పోరు మిటిమీఱుచుండ నారదుండు కొంతతడ వానందపడి మిమ్మటు వారిర్వురిమధ్య నిలచి-

## మంజరి

తగునె మీరిట్లు యుద్ధంబొనర్ప । దానవ నాయకులారా !
తగ నాపల్కులు వినకుండిన నే । దయసేతు భూమిఁజేర.

వ॥ అని సాగిన, కార్యాతురుండగుటచే రావణుండు కొంత శాంతించి నారదున కడ్డుపోయి మరల గొనివచ్చిన నారదుండు మయుని శాంతునిజేసి రహస్యంబుగా నిట్లనె. దానవేంద్రా ! రావణుండు నీయింటనున్న మండోదరింగాంచి పార్వతి యని భ్రమించుటకుఁగల కారణం బెరింగింతు వినుము-

సీ॥ సర్వలోకేశ్వరు । శర్వునింగూర్చి రా
రాక్షసపతి దపమును । సల్పెనన్న !
పరమేశుఁ డీతని । వరము వేఁడుమటన్న
గౌరీమహాసతిఁ । గోరెనన్న !
సత్యవాక్యమునకై । శంభుఁ డంబనొసంగ
సురవైరి గొనిపోవు । చుండెనన్న !
దాక్షాయణిని మయు । దాపునదాచి, శ
క్తి నొసంగెనని నేను । దెల్పితన్న !
గీ॥ "శక్తి"యన నమ్మి హారుస కొ । సంగెనన్న !
పార్వతియటంచు నీ సుతఁ । భ్రమసెనన్న !
అరయ నీకిట్టి యల్లుఁడు । దొరకడన్న !
చిన్ని సుతనిచ్చి పెండిలి । సేయుమన్న !

వ॥ అనిన నారదు వాక్యానుసారంబుగా మయుండు తన పుత్రిని రావణున కొసంగి వివాహంబొనర్చె. నారదుండు తన

దారి నేగె. మండోదరీసహితుండై రావణుండు లంకకు వచ్చుచు మార్గమధ్యంబున మండోదరిని పార్వతీ! పార్వతీ! యని మాటి మాటి కనుచుండ మండోదరి యిట్లనె-

ముఖారి—రూప

దాక్షాయణి నంచునన్ను । దలఁచెదేల ? ప్రాణనాథ !
రాక్షసేశ ! కానుకాను ! వీక్షింపుము మండోదరిని ॥దా॥
పరదేవత పార్వతేడ ? పాపినైన నేనేఁడ ?
హరహర ! జగదంబను ని । ట్లాఁడిన నరకంబుగాదె ? ॥దా॥

వ॥ అని యెంతబోధించినను వాని మతంబు మానక యామెతో లంకకుఁజేరి తల్లింజూచుటకై నామె యంతఃపురము నకు భార్యాసహితుండై యేగి తల్లియైన కైకసికి సమస్కరించిన యామె కుమారుని దీవించి శివలింగము దెచ్చెనని సంత సింపుచు నాయనా! పరమేశ్వరుం డాత్మలింగ మొసంగెనా ? యనిన నాతఁడిట్లనె-

ఆ॥ పరమశివుఁడు నాదు । భక్తికిఁ గడుమెచ్చి
పరమసౌఖ్యమైన । వరమొసంగె
నాత్మలింగమేల ? సంబనేఁ దెచ్చితి
నదిగో ! కోడలమ్మ । నమ్మ ! నీకు.

వ॥ అనిన భయమంది కైకసి రావణుని వెనుకనున్న యా జగన్మోహనాకారంబునుంగాంచి పార్వతియని భ్రమించి రావణుంగాంచి కోపంబున నిట్లనె-

**కేదారగౌళ—ఖండగతి**

పుత్రకా! నీకేమి । పోఁగాలమయ్యెరా!
ధాత్రిజీవులకీమె । తల్లిగావలెఁ గదా? ॥పు॥
వరము వేఁడుమటన్న । హరుని నిటువేఁడితివె
పరమపాపీ! జగ । త్పావనిం దెచ్చితే? ॥పు॥

మ॥ అల సర్వేశు నిజాత్మలింగమును వేనర్చించినన్ బాపముల్
దొలఁగించున్ గడుపుణ్యమబ్బునని సం । తోషించి నిన్ బంప, నో
తులువా! శంభునిఁజిక్కువెట్టి సతినిన్ । దోడ్తెచ్చితే? దైత్యరా
ట్కుల నాశంబగుగాన నీమెమరలన్ । గొంపోయియర్పింపుమా

వ॥ అని కోపించిన రావణుం డిట్లనె-

శా॥ తల్లీ! యేటికి నన్నుదూరెదవు నీ । తన్వంగియే నన్ను దా
నుల్లంబందువరించె, నారదుఁడు దా । నుత్సాహియైగూర్మిసం
ధిల్లన్ జేసెను, నిందబద్ధ మిసుమం । తేఁ గల్గినన్ నీవె యీ
పిల్లన్ గన్గొను (మండోదరింజూచి) నేనె గౌరినని నీవే
దెల్పుమా? పార్వతీ!

వ॥ అనిన మండోదరి పార్వతినని యబద్ధమాడుటకు నోరాడక, రావణునిబాధ పడఁజాలక, కంటనీరు గార్చుచుండ కైకసి మండోదరింగాచి భక్తిపూరితయై కరంబులు జోడించి యిట్లు స్తుతించె-

## ద ం డ క ము

శ్రీపార్వతీ ! లోక రక్షామణీ ! భక్తసంసేవ్య పాదారవిం
దే ! మహాదేవి నీదివ్య చారిత్రముల్ శ్రీశ, వాగీశ, దేవేశు, లే
వర్ణనల్ సేయఁగాఁజాల రేనెంతదానన్, భవానీ ! జగంబుల్
సృజింపంగ, బెంపంగ, ద్రుంపంగ, నీవేకదా ! మూలమో
యమ్మ ! నీపాద రాజీవముల్ నాదు చిత్తంబునన్ నిల్పి స
ద్భక్తితోఁ గొల్చెదన్ దాసురాలిన్ గటాక్షింపవే! విశ్వమాతా!
త్రిలోకాధినేతా ! సుమోక్ష ప్రదాతా ! నమస్తే ! నమస్తే !
నమస్తే నమః.

వ॥ తన్ను స్తుతించి నమస్కరించిన కైకసిం గాంచి మండోదరి దిగ్భ్రమనొంది చేతులు జోడించి యిట్లనె-

## స ం వా ద ము

గీ॥ మండో :— అంబఁగానుస్కార । మత్త ! నీకు
కైకసి :— నాదిశక్తివి తల్లి ! జో । హారు నీకు
మండో :— నయ్యయో ! పెద్దదాన వ । ట్లనకు తల్లీ !
కైకసి :— జీవులకునెల్లఁ బెద్దవు । నీవెతల్లీ !

వ॥ ఇట్టు లొండొరులు నమస్కరించుకొనుచుండ రావణుం డేమియుందోచక మండోదరింగాంచి కోపంబున పార్వతీ ! నీ మాయలింకఁ గట్టిపెట్టి నిజం బెరింగించి మా తల్లికి మనశ్శాంతి యొనర్పుమన, మండోదరి యత్యంత దుఃఖితయై నారదుని దలంచి తనలో నిట్లు చింతించె-

సీ॥ కోరుకొన్న నాథుని సమ । కూర్చితంచు
నిక్క రానంద మొంద స । న్నిట్లు దుదకు
దుర్భర మనోవ్యథాగ్నిలో । ద్రోచినావు
నారదా ! యింక నాకేది । దారి యకట.

వ॥ అని యేడ్చి మూర్ఛిల్లిన రావణుండు తనలో నిట్లు దలంచె-

ఉ॥ కాళిని నేనుగాననుచు । గాళ్లపయింబడి యేడ్చె పాపమీ
బాల ? మహామునీంద్రుఁ డిదె । పార్వతియంచును దెల్పి పోయె, నా
శీలుఁ డబద్ధమేమిటికిఁ జెప్పు ?...భవానినిఁ గోరినా నటం
చాలరి నారదుం డిటుల । హాశ్యమొనర్చెనో! దోచదక్కటా?

వ॥ అంత మండోదరి మూర్ఛఁదేఱి రావణుని పాదములపైఁబడి యేడ్చుచూ నాథా ! నేను నీ పాదసాక్షిగ ప్రమాణమొనర్చి చెప్పుచున్నాను, నిక్కముగా మయుని కొమార్తెనగు మండోదరినిగాని పార్వతినిఁగాను, నారదుండు నీ రూప లావణ్యాదులు మున్నొకనాడు నా కెఱింగింప నా మనఁబున నిన్నే వరించితిని. యమ్మహాత్ముఁడు నా యదృష్టవశంబున నిన్నటకు దెచ్చి నాకు వివాహమొనర్చె. నీ చిత్తభ్రమ మంతయు నారదుని తంత్రముగాని వేఱుఁగాదు. మఱియు నారదుండు నీపట్ల మేలే యొనర్చె నదెట్లన, లోకమాతను గామించి తెచ్చిన నిన్ను నరకంబునుండి యుద్ధరించె. మనోహరా ! నా ప్రార్థన మంగీకరింపుము. పార్వతియన నేమిగా దలంచుచుంటివి-

సీ॥ ఏ మహాశక్తి, మూ । ర్తిత్రయంబునుమించి
దనవెల్గుచేఁ జీవ । తతినిఁబ్రోచు
ఏ మహాశక్తి, దా । నింద్రాదులకుఁగూడ
దృగ్గోచరంబయి । దోఁచుచుండు
ఏ మహాశక్తి, లీ । లామాత్రమున సర్వ
బ్రహ్మాండ భాండముల్ । బ్రజ్వరిల్లు
ఏ మహాశక్తి, ప । విత్ర నామోచ్చార
ణంబున దురితంబు । లడఁగిపోవు

గీ॥ ఆ మహాశక్తి, చిచ్ఛక్తి । యాదిశక్తి,
యాత్మశక్తి, పరాశక్తి, నమితమూర్తి,
సేవ లొనరించి మోక్షము । జెందమాని
తల్లిపైఁ మోహమందుట । తగునె నాథా !

వ॥ అనిదెల్ప రావణుండు పశ్చాత్తాపతప్త హృదయుండై, మోహాంధకారంబునుండి వెలువడి, దుఃఖించుచు పార్వతిం దలంచి హే జననీ ! పరమ పావనీ !

నాదనామక్రియ—రూప

పాహిమాం జగన్మాతా ! భక్తలోక పారిజాత !
మోహపరవశుండనై యు । మోఘ పాప మొనరించితి ॥పా॥
కన్నతల్లి ! నీకంటె, "నస్యథాశ్శరణం నాస్తి"
నన్నింతింతగ గోసిన । నా పాపము నశియింపదు ॥పా॥
మి॥ ఎన్నగ లోకమాతవగు
నిన్నే కామించితి గద

కన్నుమిన్నెరుంగని సక్
కట్టి కుడుపదే పాపము ॥పా॥

ఉ॥ నీ మహిం బెరుంగక వి । నీతుండ నీక్ గనుంగొన్నయంతనే గామము నొందితిమ్మ! కడు గల్మష చిత్తుండనమ్మ! లోకమాతా! మదినుంచకమ్మ! నను । ధన్యుని జేయగదమ్మ! నే భవన్నామమె జీవసంబనుచు । నమ్మెదనమ్మ! క్షమింపు మమ్మరో!

వ॥ అని పశ్చాత్తాపబడి తన బుద్ధి మరల్చుకొని కైకసిం గాంచి-

## మ ం జ రి

కామాంధుండనై నీ కోర్కెందీర్ప । గా లేకుంటిని నేను
కామారిని మెప్పించి లింగమును । గైకొన కింటికిరాను.

వ॥ అని దెల్పి ఘోరారణ్యమున కరిగి శివునింగూర్చి ఘోరతపం బొనర్ప రావణుని పశ్చాత్తాపబుద్ధికి హరుండు సంతసించి వానికి మరల బ్రత్యక్షుండై యాత్మలింగ మొసంగి-

## మ ం జ రి

దీని నెందైన భూమిపై నుంచె । దేని మరల రాదన్న!
దానవేశ్వరా! నీ యిష్టంబని । దాటిపోయె హరుండెన్న.

వ॥ అంత రావణుండా లింగముంగొని తన లంకానగరంబున కరుగుచు దారిలో గోకర్ణ క్షేత్రమున కేగుసరికి సంధ్యాకాల మాసన్నముకాగా రావణుండు తన నిత్యకర్మానుష్ఠాన మొనర్పనెంచి లింగమును భూమిపై నుంచిన మరల రాదని సంశయించి "దీని నెవ్వనిచేతికిచ్చి సంధ్యావందనకృత్యము దీర్చి

కొందునా” యని దలంచుచుండ నా క్షేత్రమున నొక్క దివ్యా
శ్రమంబున దపం బొనరించు శాండిల్య మహాముని యాశ్రమంబు
చూపుమేరలో గనుపించె నంత రావణుండా యాశ్రమ సమీ
పంబున కేగి యచ్చటనున్న మునిబాలకునిం గాంచి నాయనా!
నేను రావణుఁడను. సంధ్యాకాలము సమీపించినది యాహ్ని
కము దీర్చికొనవలయును. నందనుక నీ యాత్మలింగమును నీవు
బట్టుకొనుము. దీనిం గ్రిందనుంచిన మరల రాదని శివుని యాజ్ఞ
గాన దయయుంచి దీనిని క్రింద విడువక నొక గడియకాలము
పట్టుకొనుము నీకు పుణ్యము గల్గునని ప్రార్థింప నామునిబాల
కుండు తన మనంబున “ఔరా! నేనెంత పుణ్యాత్ముండను భగ
వానుని యాత్మలింగమును ధరించు నదృష్టము గల్గెనని సంత
సించి రావణా! యట్లే కానిమ్మ”ని యా లింగమును గైకొన
రావణుండు పశ్చిమ సముద్రతీరమున కేగి సంధ్యవార్చుచుండె.
నిట మునిబాలకు డాలింగమును నత్యంత శ్రద్ధతో దనచేతుల
నుంచుకొనియె. నింతలో నా ఘోరారణ్యంబునుండి-

## మ ం జ రు లు

కడుఁ బసిలేడిని గాంచి వెంటాఁడి । గాంఢ్రించి బొబ్బలిడుచు
వడి నాశ్రమభూమిఁ జేరవచ్చెడి । వ్యాఘ్రముగని భయపడుచు
గడగడ వడకుచు లింగముతోడుత । పుడమి మూర్ఛఁబడె
వటుడు
వడుగు చేతిలోనుండి లింగ మా । వసుధ జారిపడె నపుడు.

వ॥ అంతలో రావణుం డరుదెంచి యా వటుని
మూర్ఛను, యాత్మలింగ పతనమును, గాంచి గుండె ఝల్లుమన

చింతా సముద్రమును మున్గి నా బాలుండు మూర్ఛఁ దేఱగనె యూతనివలన తద్వృత్తాంతం బంతయు విని తన ఖర్మమునకు సత్యంత దుఃఖితుండై -

సీ॥ తన యదృష్టంబుచే తను లభించినయట్టి
పెన్నిధిఁబోయిన । పేదవోలె ?
శే ఒవల్ జదివి బ । రీక్ష వేళకు దప్పి
వ్యర్థుఁడైనట్టి వి । ద్యార్థి కరణి ?
కడువృద్ధుఁ డగుదన్నుఁ । గాపాఁడు సుతుని గో
ల్పడి యేడ్చు ముదుసలి । వానిరీతి ?
కృషిసల్పి వాన లే । కుంటచే, పంట ఫ
లము చెడి కాపు ల । ల్లాఁడు మాడ్కి ?
గీ॥ ఘోర తపమొనరించి యు । గ్రుని యనుగ్ర
హమున దా దివ్యలింగము । నంది తుదకు
నిష్ఫలుండయి లింగము । నిలచినట్టి
దాపునం బడియేడ్చె న । ద్దానవుండు.

నాదనామక్రియ—రూప

ఆకటకటా ! నా కెంతటి । యాశాభంగమ్ము గల్గె
ఇక జనని మొగం బెట్టుల । వీక్షింతును రిక్తుడనై ॥య॥
ఆత్మలింగ మేదన్నచో । నమ్మకేమి దెల్పువాఁడ
నాత్మశక్తి ధారవోసి । యధిక తపము సల్పితినే ॥య॥

వ॥ అని దుఃఖించుతరి నారదుండు గాంచి "ఆహా ! మానవు లెంత పుణ్యాత్ములు, రావణుని ప్రమాద బుద్ధియే పరుల కెంత యుపకార మొనరించె"నని సంతసించి-

మాల్కోసు—చతురస్ర

ఆశ్రితజన హృద । యా సంకరా!
అమల శరీరా! జగదోద్ధారా! ॥ఆ॥
భూకైలాస । గోకర్ణేశా!
రాకా చంద్రప్రకాశేశ! భవనాశ! ॥ఆ॥

వ॥ భగవన్నామ మొనర్చుచు రావణుం గాంచి యాత
నిచే సవిస్తరం బెరిగి రాక్షసేశ్వరా! విధి విధానము నెవ్వరు
దప్పింతురు. నీ చింతమాని యింటికేగుమన నాతం డిట్లనె
"మునీంద్రా! యాత్మలింగము గొనక తల్లి మోమెట్లు
గాంతును. నేనును యీ దివ్యలింగమును సేవింపుచు నిందే ప్రాణ
ములు వాసెద"నని పట్టుదల వహించి బల్కిన నారదుండంత
లంక కేఁగి కైకసికీ వృత్తాంతంబు దెల్పి "అమ్మా! నీ దయచే
లోకానందమును, మానవులకు పరమేశ్వరు నాత్మలింగారాధన
మును, గల్గె గాన నీ వందులకు సంతసించి నీ కుమారుని మది
సమ్మతిజేసి దోడ్తెచ్చుకొనుమన" కైకసి యట్లులేయని మునితో
గోకర్ణ క్షేత్రంబుజేరి కుమారుని గాంచి యిట్లనె-

మ ం జ రి

లింగ మిటనుండి రాలేదంచును । నీకేల దుఃఖ మిందు
గంగాధరు డుండినఁజాలుఁను నా । కాత్మానందము నొందు॥

వ॥ కాన నీవు నా కోరిక దీర్చి మాతృఋణము చెల్లిం
చితివి సంతుష్టహృదయనైతి లంకకేగుదము రమ్మన నింతలో
పార్వతీ పరమేశ్వరులు ప్రత్యక్షమై, భక్తులారా! నా దివ్యలింగ

స్థాపితమైన యీ గోకర్ణక్షేత్రమే "భూకైలాసము" యిందు నన్ను బూజించిన మానవులు నా సాన్నిధ్య మందుదురు. మీకు శుభంబగుగాక! యని యంతర్హితులైన వారంద రిట్లు పార్వతీ పరమేశ్వరులకు మంగళము పాడిరి.

**బిలహరి—రూప**

గంగాధర! గౌరీశా! మంగళమిదె శ్రీ మహేశ!
సంగీత విలాస! యాత్మ లింగా! ఘనపాప భంగ! ॥గం॥
అఖిల జీవనాధారా! ఆశ్రితజన మందారా!
ఆగమాంత సంచారా! హర! గోకర్ణ విహారా! ॥గం॥
బాల నిశాకర మాళీ! భక్తజన మనఃకేళీ!
జాలమేల "శ్రీ పున్నయ! శాస్త్రి" నేలరా శూలీ! ॥గం॥

శ్రీ పార్వతీ పరమేశ్వరార్పణమస్తు.



విజయ ప్రెస్, విజయవాడ.